Reg. No 757.

# అభినవసరస్వతి.



యను నొక మాసపత్రిక.

జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.
జానపాడు.

సంపుటము 17 | 1925 సం॥ ఫిబ్రవరి నెల | సంచిక 11

## విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, వెనికేపల్లి.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, వైకుంఠపురం.
౩ బాకరాజు పరాంకుశరావు దేశాయిగారు. యాదవరం.
౪ రామలింగుగారు- నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు.
౨ ఎనమండ్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోద్గుంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు- నారాయణపురము
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౨ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, పసీరుపల్లి.
౧౩ ఓబులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౪ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౧౫ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౬ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, సిరిసిల్ల.
౧౭ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానకొండూరు
౧౮ పొట్లపల్లి జగన్నాథరావు దేశముఖుగారు, ఆశ్వారావుపల్లె

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౩ సంగెం రామారావుగారు, సంగెం
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట
౭ నారాయణరావుగారు, దాతారుపల్లె
౮ వేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట




# అభినవ సరస్వతి

సంపుటము ౧౭ | జానపాదు. క్రోధన సం॥ మాఘమాసము. | సంచిక ౧౧

## గుంటూరు కోలాహలము.

గడచిన ముక్కోటియేకాదశికి శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి పీఠాధిపతులు గుంటూరునకు విజయముచేయుటయుఁ జాలమంది బ్రాహ్మణులు భక్తిశ్రద్ధలఁ గనఁబఱచి పరిపూజించి తత్పాదపద్మారాధనచేతను జంద్రమౌళీశ్వరదర్శన తీర్థప్రసాదస్వీకారము చేతను దదుపదిష్ట ధర్మోపన్యాసశ్రవణముచేతను బరిపూతాంతఃకరణులైరి. కొందఱుపేక్షవహించిరి. కాని మునుపటిమాన్యాలు ముంచకుండినఁజాలు నిప్పటిమాన్యాల నిచ్చినట్లును సామెతగా నుపేక్షగూడ వహింపక పీఠాధిపతులను దదాస్థాన విద్వాంసులను వేయేల తత్పీఠాభిమానశీలురగు నెల్లరనుగూడ బిట్టు దూషించి పెక్కు కరపత్రములు పంచి కొందఱు కొంతకోలాహల మాచరించినందులకై యుందవలసివచ్చినది. అట్టివార లేనీచులో యైన నింత విచారింపఁ బనిలేదు కాని లక్ష్మి యెవరియిండ్ల సదా నివసింపఁ జూచుచుండునో యెవరు సర్వవర్ణజీవనములకును సాధారభూతులో దేవబ్రాహ్మణభక్తి యెవ్వారికిఁ గులశీలమో యెవరికీర్తి పోష్యమాణ విద్వద్బ్రాహ్మణాదుల ద్వారమునను బాల్యమాన దేవాలయాన్నసత్రాదుల ద్వారమునను దిగంత విశ్రాంతమగుచున్నదో యట్టి శ్రీమంతు లట్టి పరోపకారసారిణు లట్టి సుజనవర్యులు వైశ్యులే యిట్టి యకృత్యమునకుఁ గడంగి తత్పురమునకును మండలమునకును దేశమునకును వేయేల జాతికంతటికిని నపయశస్సు గడించినందులకై యత్యాశ్చర్యవిచారముల నందవలసివచ్చినది. వీరు కులక్రమాగత పూర్వోక్తగుణ విశిష్టులగుటయే కాక ప్రకృతకాలానుగుణముగా విద్యాధికులుగూడ నైయున్నవారు. అట్టివారి కిట్టివిపరీతబుద్ధి పుట్టుట వైపరీత్యకాలమహిమ కాకమానదు. చెట్టుచెడెడివాటికే కదా వెక్కుమూతిపిందెలు పుట్టుట. ఊరు కాడు కోసిన యెవండో బండముండకొడుకు ప్రేలినట్లు మూఢుఁడుబ్బాల సన్యాసనియు నేమోయనియును శంకరగురుపరంపరాగతపీఠాధిష్ఠాతలై శమదమాదిగుణసంపత్తి గలిగి నాలుగు సం॥ల నుండి నలుబదియామడ భూమింగల విద్వద్బ్రాహ్మణాది నానా జనులచే నపరిమితద్రవ్యవ్యయపూర్వకముగా నర్చింపఁబడుచు జగజ్జేగీయమానముగా సంచరించు పరివ్రాజకాచార్యులఁ బడఁదిట్టుట యధికపాపావహము

ఏ పోలిసెట్టి యాదినారాయణ గుప్తగారో యే చీమకుర్తి కుమారస్వామి గారో తమకుఁ గలిగిన యాంగ్లేయభాషా పాండిత్యము సార్థకముగాఁ గరపత్రములఁ బంచిరే కాని మాకుఁ దెలియదని తప్పుకొనుటకుఁ గూడ వీలులేనంత సాహసము వయోధికులు విద్యాధికులు ధనాధికులు యశోధికులు నైన మద్ది వెంకటసుబ్బయ్యగారు మున్నగు మహామహులే కావించుట కడుశోచనీయము- వైశ్యవంశజులే యగు దొడ్డా వెంకట రత్నముగారు శ్రీ పుష్పగిరి స్వాములవారికి భిక్షసేయఁగడంగుటయు వలదని యనేక విధముల బోధించి తమ బోధ యాయన చెవి కెక్కమికిఁ గినిసి కోనేటిలోఁబడి ప్రాణ త్యాగము చేసికొనెదనని పోవుచుండఁగాఁ గొందఱు పట్టుకొని వచ్చిరట్లును వెంకట రత్నముగారీసంగతి మండలాధికారికిఁ దెలియపఱచినట్లును వారు పిలువఁబంచి వెంకట సుబ్బయ్యగారు మొదలైన కొందఱు వైశ్యనాయకులమూల నాత్మహత్యాద్యకృత్య ముల నాచరింపకుండునట్లు జామీను పుచ్చుకొన్నట్లును వినవచ్చెడిని. స్వాములవారు పురప్రవేశము సేయునప్పుడు వెంకటరత్నముగారి సత్రములో దిగనీకుండ నాలుగు వందలమంది వచ్చి కోలాహలము చేసిరఁట. అయినను వెంకటరత్నముగారొంటికిఁ దగు నుత్తరమిచ్చి ధిక్కరించి శ్రీ స్వాములవారిని బ్రవేశపెట్టిరఁట. వెంకటసుబ్బయ్య గారి కేమి తక్కినవారి కేమి యింతంతసాహసములు చేయుట కేమంత మందభాగ్యము మీఁదఁబడినదో తెలియఁబడదు. పీఠాధిపతులకుఁ బూజచేయఁగూడదని సభలలోఁ దీర్మా నించుకొనియుఁ దమ తీర్మానము ప్రకారము నిలువక శ్రీవారికి భిక్షాపాదపూజాదులు జరిపిన తక్కిన వైశ్యులయిండ్ల కెవ్వరును భోజనభాజనముల కరుగరాదని కట్టుకట్టియు నీ వైశ్యపుంగవులు సంపాదించిన పుణ్యముగాని పురుషార్థముగాని యెంతయుం గానఁబడదు. అపయశస్సు మోయుటయుఁ బ్రభుత్వమువారిచే మందలింపఁబడుటయుఁ బురోహితులచే విసర్జింపఁబడుటయు నీయాత్మలాభయుక్తమాత్రము మనవారికిఁ గలిగినవి. పైరెంటికిని జేయలేకున్నను దుర్గానికిమాత్రము తోఁచినట్లుప్రతిక్రియ సేయనే చేసిరి కాని యూరకుండలేదు. పురోహితులు తమ్ము విసర్జించిరని దామును బురోహితుల విసర్జించి దానములుపట్టియు దర్భకట్టలు చంకంబెట్టియుఁ బౌరోహిత్యమునకు దిగిరి.

బ్రాహ్మణులు స్వయంకృతాపరాధమునఁ గొంతయుఁ గాలమహిమమునఁ గొంతయుఁ బ్రజలచేతను బ్రభుత్వమువారి చేతను నిరసింపఁబడినఁ బడుదురుగాక శాస్త్రములచేత మొదటనే యుంపఁబడియుండిరి. సర్వవర్ణములవారికిని వారు గురువులు వారికి గురువులు పీఠాధిపతులు. అట్టి పీఠాధిపతులఁ దిరస్కరించి పూజానమస్కారా దులు చేయవలదని వైశ్యులు కట్టుకట్టిన తరువాత వారియిండ్లఁ బౌరోహిత్యముచేయింప వలదనియు వారినే యాశ్రయించి జీవింపక వ్యాపారాదు లవలంబింపవలెననియు వీరును

సభలు సంఘములు నేర్పఱచుకొనుటయు వైశ్యనాయకు లెక్కడికో యేగి కొందఱు బ్రాహ్మణులఁ బౌరోహిత్యమునకుఁ దీసికొనివచ్చిరి. యేకులమున నైనను గట్టునిలుచుఁగాని మాకులమున మాత్రము నిలువదు. శ్లో॥ నజానాం మందబుద్ధిశ్చ సర్వాణాం మనిద్రతా బ్రాహ్మణానా మనేకత్వం త్రిభిర్లోకోపకారితా॥ అను న్యాయమును సార్థపఱచుచు బ్రాహ్మణు లనేకత్వమే యవలంబింపకున్న నిట్లధోగతి నేలకూలుదురు కనుక మావారు పురోహితులుగాఁ గొందఱు దయచేసిరి. వచ్చినవారిని గొందఱు మంగళించిరి. అందులకు వెఱచి కొందఱు చనిరి. కొందఱు మసిరి. వునిన నేమి-వినిన నేమి గుంటూరు వైశ్యులు రమారమి ౧౦౦౦౦. ఇందఱికి ముగ్గురు నలుగురు పురోహితు లేవి చాలుదురు? అందులో సూర్యోపరాగము తటస్థించుటయుఁ బ్రముఖులయిండ్లకు మాత్రము బాపనయ్యలఁ బంపి తక్కటివారి యిండ్లకుఁ దండోపతండములుగా బంచాంగములు చేతఁబట్టియు దర్భాట్టులఁ జంకలఁ బెట్టియు వైశ్యయువకులే బయలువెడలిరి. వారికి నాయకులై వద్దివెంకటసుబ్బయ్య ప్రభృతులు మోటారులోఁ బ్రతియింటిముందఱ నాఁగుచు మీరు తర్పణములు విడుతురా మీరు శ్రాద్ధము పెట్టుదురా యని ప్రశ్నించి బలాత్కృతిపై నందఱిచేతను నువ్వులు నీళ్ళు విడిపించి బాపనయ్యలకుఁ బావలానీయనివారిచే నెల్లఁ బదిపావలాలిప్పించి వణిక్పురోహితుల నలవార్చిరి. పాపము గుమ్మడికాయలు మోయలేక నెత్తులును బియ్యపుమూటలు మోయలేక వీపులును వైశ్యయువకులకుఁ గాయలు కాచెను. గడచినమాసమున గుంటూరులో నిట్టికోలాహలము నడిచెను. ఏకోలాహలము నడచిన నేమి! ఎన్నిమాసములో యుండవలసిన స్వాములవారిరువదిదినములే యుండుదురు గాక. నిత్యము గజోత్సవములే. నిత్యముఁ . పాదపూజలే - నిత్యము వారి సత్రమున వేయిరెండువేల బ్రాహ్మణుల కన్నప్రదానమే - వారి వైభవమున కీమన్మాత్రమును లోపములేదు. దొడ్డా వెంకటరత్నముగారు, లింగమల్లు రామచంద్రరావుగారు మున్నగు వైశ్యులుగూడఁ గొందఱు శ్రీవారికి విధేయులై సేవించిరి.

దేవబ్రాహ్మణులయందేమి దేశగురువులయందేమి యత్యంతభక్తియుక్తులై యనవరతము సేవించు బెజవాడ మొదలగుచోట్ల వసించు వైశ్యులఁ జూచియైనను గుంటూరు వైశ్యులు కొంత దారికివత్తురు గాక. స్వాములవారో యెవరో కర్నూలులోనో కొల్లాపురములోనో తమ్ము వైశ్యులు గారనియు వేదోక్తకర్మాధికారము లేదనియు నేమో యనియు నగౌరవపఱచిరనియు నందుపై మేమిట్లు ప్రతిఘటించితిమనియు మన గుంటూరు వైశ్యులు కొంత ముచ్చటింతురఁట. వానికిని యతుల కీనజాంచోళి కాదు లనవసరమను వానికిని మఱికొన్నింటికిని సమాధానముగా జాతుర్వర్ణ్య మహాజనులకుఁ బ్రబోధనమను

శిక్షకతో గుంటూరుపురవాసులేయగు మల్లాది లక్ష్మీనారాయణ ప్రయాగ చంద్రమౌళి శర్మగార్లచేత నొకపాత్ర మచ్చొత్తింపఁబడియున్నది. ఆయంశములు తెలిసికొనఁ గోరువార లద్దానిఁ బఠింతురుగాక. వలయుచో మాపత్రికయందే యొకపరి ప్రచురింతుము.

## — * సప్తాహములు * —

పెక్కండ్రుజను లిట్లు బ్రహ్మద్వేషులగుచుండుటచే బ్రాహ్మణుల వన్నె తఱుగుచున్నను వారే యింకను సప్తాహాది సత్కార్యములు చాలఁ గావించి సకల భూతములను సంతృప్తిపఱచుటమూలమున సద్యశమును గడించుచున్నవారు. ఈమాసమున నొక్క నర్సరావుపేటడివిజనుననే మూడుసప్తాహములు: కుంకలగుంటలోఁ గూర్మదాసుగారి దొకటి. మాచర్లలో లంకా చంద్రమౌళి దొకటి. వేమవరములో సోమయాజుల అప్పయ్యగారి దొకటి. కూర్మదాసుగారి సప్తాహము క్రొత్తది కాదు. భద్రాచలమార్గమున యాత్రికుల కందఱకును దేవతలు మెచ్చ నన్నప్రదాన మాచరించుటయే కాక యేటేట నొకసప్తాహ మేయూరనో కావించుసత్పురుషుఁడీయన. నిరుడు పుష్యమాసమున నర్సారావుపేటలోఁ గావింపఁబడిన వీరిసప్తాహమునుగూర్చి యీపత్రికలో విరళముగా నిదివఱకే ప్రచురించియుంటిమి. చంద్రమౌళిగారిసప్తాహము జరుగఁబోవుచున్నది. వేమవరములో సోమయాజుల అప్పయ్యగారిసప్తాహము సర్వవిధముల సంశ్లాఘ్యముగా జరిగియుండుట చక్షుర్గోచరమగుట దృఢముగా వ్రాయఁగలిగితిని. అహోరాత్రములు నాదమువీయకుండ హరినామసంకీర్తనము, రుద్రాభిషేక సహస్రనామార్చనములు, దిన మొకహరికథ, యేడుదినములు నేడుపిండివంటలు, చివరకు శూద్రుల దగ్గరనుండి పంచముల పర్యంతము పక్వాన్నసహితముగా నన్నదానము. మూలగొట్టుగుణము వలన వేలకొలఁదివిప్రుల సమావేశము లేకపోయినను నిత్యము నూటికిఁ దక్కువ లేకుండ బ్రాహ్మణాన్నదానముతో నీకార్యము కడుబాగుగా జరిగినది. అప్పయ్యగారికి సగముద్రవ్యము చందాలవలన సమకూరినను సగముమాత్రము ఋణముచేయక తప్పినదికాదు. ఈయనయే కాదు. మఱియొకరే కాదు. కుటుంబికులైయున్నపుడు కొలఁదికిమీఱిన బరువు మైనివేసికొని ఋణగ్రస్తులై భార్యాపుత్రాదులకుఁ బరమశత్రువులు గాకుందురుగాక. "పితాచ ఋణవాన్ శత్రుః" అను నీతిని సార్థకము చేసినవారు కాకుందురుగాక!

---

శికింద్రాబాదునుండి బ్రహ్మశ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిలు గారు, శివపురపు వీరభద్రపాకయాజిగారు మున్నగు పెద్దలు కొందరు అస్పృశ్యతా నివారణ ఖండనమను పేర 16-11-25 తేదీన ప్రకటించిన కరపత్రికను జూచుట తటస్థించెను. తర్వాత వారి పత్రికకు సమాధానమని కాబోలు మే మెన్నడు వినని కనని ఆది హిందూ జాత్యున్నతి సభా కార్యనిర్వాహకులను పేరుతో నెవరో కొంతమంది ప్రకటించిన పత్రికను కనుటగూడ సంభవించినది. ఆ రెంటిని బఠింపగ దోచిన విషయమును యీ పత్రికా ముఖమున సుజనులకు తెలుపుకొనుచున్న వాడను.

ఆది హిందువులగు తమను శాస్త్రి ప్రభృతులు చండాలురనుట దూషించుట యని కడజాతివాండ్రొక వింతమాట వ్రాసియున్నారు. "ఆది హిందువ" ను పదము కాని ఆ పేర నొక జాతికలదని కాని వాండ్ర కస్పృశ్యతకలదని కాని శ్రుతిస్మృతి పురాణేతిహాసములయందెచ్చటను ముచ్చటింపబడి యుండలేదు. అందు చండాలురను నొక జాతివాండ్రుకలరనియు, వాండ్రకు మాత్రమే నస్పృశ్యతకలదనియు చెప్పబడియున్నది. శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావు, రాయప్రోలు సుబ్బారావుగార్లు ఆదిహిందువుల యస్పృశ్యత పోవలయుననుటచే వాండ్రు చండాలురైయుందురని నిశ్చయించి శాస్త్రి ప్రభృతు లట్లు వ్రాసి యున్నవారు. అది దూషణ మెట్లగును?

ఇంత యేల? ఆదిహిందువులు చండాలురగుదురా? కారా? చండాలురైన వాండ్రను చండాలురని శాస్త్రి ప్రభృతులు వ్రాయుట యుక్తమని వివేకులు చెప్పుదురు కాని దూషణమనజాలరు. ఇక ఆది హిందువులు చండాలురు కానిచో రావుద్వయము శాస్త్రాచారవిరుద్ధముగా వాండ్రకు నస్పృశ్యతకలదని చెప్పి అది నివారింపవలెనని బోధించుట వివేకికార్యమని యెవరనగలరు? ఎట్లుజూచినను కడజాతివాండ్ర పత్రికాప్రకటనమ్ము పనిలేనివానిపనిగా నున్నది. కావున కడజాతివాండ్రను ప్రోత్సహించి వాండ్రచే నీ వ్యర్థపత్రికలను వేయించుటకంటె శాస్త్రిప్రభృతులు తెలిపిన పగిది రావుద్వయము సత్సభజేసి తమ

వాదము శాస్త్రవిహిత మని నిలుపుకొనుట మంచిది. అదిచేతగాదా “ విభూషణం మౌన మపండితానాం ” అనునట్లు మిన్నకుండుట మంచిది.

ఇట్లు ధర్మాభిలాషి,
నోముగుల నారాయణమూర్తిశాస్త్రి.

ఇంతవఱకు నీపీఠికలోఁ బ్రకటింపఁబడినయంశములు లోకము ముప్పాతికమూడువీసము అస్పృశ్యతానివారణమున కనభిముఖమని నిరూపించుచు శ్రీరామకృష్ణయ్యగారు వ్రాసిన యస్పృశ్యతానిరూపణమును నస్పృశ్యతానివారణఖండనమును సిద్ధాంతీకరించుచున్నయవి. కావ్యకంఠము గణపతిశాస్త్రిగారు తమగ్రంథములో “ అస్పృశ్యతానివారణమును ఆచరణీయముగాఁగనిపెట్టిన మూలపురుషుఁడు గాంధిమహాత్ముఁడు ... ... ఆమహాపురుషుఁడు ... ... ... భగవత్ప్రేరితుఁడే. లౌకికదృష్టితోఁగాక శాస్త్రీయదృష్టితోఁగూడ విషయమును పరిశీలించి మే మతనియందు ప్రత్యేకపక్షపాత మేమియు లేనివార మైనను ఆతని దయార్ద్రసందేశమును శిరసాస్వీకరించితిమి ” అని పేర్కొనియున్నవారు. ఇట్లే మఱికొందఱు సంఘసంస్కరణవాదు లగు స్వరాజ్యకాములు వ్రాయుచున్నారు. అస్పృశ్యతానివారణము నాచరణీయముగాఁగనిపెట్టిన యా గాంధిమహాత్మునియెడలఁ బ్రకృతము బుద్ధిమంతు లెట్టియభిప్రాయము వహించుచుండిరో దిగువఁ దిలకింపుఁడు.

1925 వ సం॥ జనవరినెల 7 వ తేది

(ఆంధ్ర వారపత్రిక)

# గాంధిమహాత్ముఁడు.

## అస్పృశ్యతానివారణము.

### బొంబాయిలో ప్రతికూలుల సభ

“ బెల్గాం కాంగ్రెసు మహాసభ కధ్యక్షుతవహించి మహాత్ముఁడు ప్రారంభోపన్యాసమున అస్పృశ్యతనునిరసించుట అక్రమమని ఆక్షేపించు

టకు బొంబాయిలో మనమోహన్దాసు రాంజీగారి అధ్యక్షతక్రింద బహిరంగసభజరిగినది. "ఇప్పుడు అంటువ్యాధులు తగిలినవారిని ప్రత్యేకించుచున్న పద్ధతిమీదనే వెనుక అస్పృశ్యత ఏర్పడినది. హిందూసంఘమునందలి అంత్యవర్ణములవారు నీతిమతాచారములకు విరుద్ధముగా మెలంగుటచే వారస్పృశ్యులని ప్రత్యేకింపవలసివచ్చినది" అని రాంజీగారు నుడివిరి. "గాంధిగారు నాస్తికుడు. ఒక పంచమకన్యను పెంచుకొని తనకుమార్తెనుగా చూచుకొనుచు తనయింటనే యుంచుకొనెను. ఇది హిందూమతధర్మములకు కేవలము విరుద్ధము. ఇట్టి దుష్కార్యము లొనరించువారని శిక్షింపకుండుటచే హిందువులు వీరికి వందలని స్పష్టమగుచున్నది. ఇట్టి మతవిరుద్ధములగు పనులనుచేయుచు ఇతరులనుగూడ ప్రోత్సాహపరచుచుండువారిని పీక పిసికి చంపుటకు సాహసించువారుగూడ హిందూసంఘమున కొందరు కలరు" అని సభలో నొకడు పలికెను. అతడట్లు పలుకగానే సభలో గొప్ప గగ్గోలు కలిగినది. మతము కొఱకు హిందువు లెట్టిత్యాగమునైన చేసెదరని నొక్కిచెప్పుటయే యీవ్యక్తి ఉద్దేశముకాని నిజముగా దౌర్జన్యము సలుపుట అతని యుద్దేశముకాదని అధ్యక్షుడు రాంజీగారు సర్దిచెప్పి సభ్యులను సమాధానపరిచిరి. వైకంలోను తారకేశ్వరములోను సత్యాగ్రహము ప్రారంభించినవారు మతద్రోహులని గూడ ఆవ్యక్తియే పలికెను. అస్పృశ్యతను తొలగింపగూడదని ప్రచారము చేయుట కొక ఉపసంఘము మేర్పరుప బడెను."

ఇందుపైని వజ్రాయుధపత్రికాధిపతి కవిరాజశ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారేమి యభిప్రాయ మిచ్చిరో యాలోకింపుడు.

"ఈవ్యాసమును జూచి ఇక్కాలమునందు గూడ నిట్టి సభలు చేయువారుండిరా? యని మిక్కిలియచ్చెరువు నొందితిని. గాంధిగారి యందు నాకిప్పుడంతవిశ్వాసము లేక పోయినను ఇందు నాస్తికుం డని చెప్పినమాటలో నేనేకీభవింపను. వక్త యభిప్రాయము నాస్తికుం డనగా జాతిమతాచారహీనుం డని యర్థము కావచ్చును. ఒకప్పుడొక మహావిద్వాంసుడు నాతో "గాంధి ప్రత్యక్షబౌద్ధుడు. హిందూ మతధర్మములను నాశనమును జేయుటకైన రాక్షసాంశసంభూతుడు,

అతనివలన దేశము నాశనమైనది" అని మొదలయిన పలుకులు చెప్పినప్పుడు నాకెంతో కష్టము తోఁచినది. అంతఁగొంత కాలమునకే తిరుపతిలో వేంకటేశ్వరాలయములోనికిం బోయి మాలమాదిగలు దేవుని ముట్టుకొని సేవించుటకు హక్కు గలదని ప్రబోధించినట్లు పత్రికలలో విని నిర్విణ్ణుఁడ నైతిని. గాంధిగారి పేరు మున్న మిక్కిలి పొగడియున్నవాఁడను. ఇప్పు డానోటితోఁ దెగడ వలంపను గాంధిగారికి శాస్త్రజన్యజ్ఞానము గాని లోకజ్ఞానము గాని రాజకీయజ్ఞానము గాని లే దని స్పష్టమైనది. రామాయణకాలమున వేశ్యలు లే రని వీ రెన్నో యుపన్యాసము లిచ్చియున్నారు. ఋశ్యశృంగుని రప్పించినది వేశ్యల చేతనే యని వారికిఁ దెలియదు. రాజకీయవ్యాపారములో వారు చేసిన చేతలే తచ్ఛూన్యత్వమును జాటుచున్నవి. గాంధిగారిని నెత్తిపైఁ బెట్టుకొని పూజించినవారే యిప్పుడు పెక్కుమంది దూషించుచున్నారు. " సహాయనిరాకరణము చేయవలెను. పన్ను లెగవేయవలెను " అని దేశమంతయుఁ బ్రబోధము గావించి వైస్రాయికి యుద్ధమును బ్రకటించినట్లు నోటీసిచ్చి తుదకుఁ దాను జల్లగా జాఱి మాఱిపోయినాఁడు. ఆయనమాట విని మనసోదరు లెందరో కారాగారంబులం బడి నానా కష్టములపాలై పోయినారు. ఇతనిమూలముననే మనదేశీయులు పెక్కువేలు రణనిహతులై పోయినారు. కోట్లకొలఁది ధనము సముద్రము పాలైనది. ఆయన ప్రాణమునకుఁ బడి యిప్పు డెందఱో దుఃఖించుచున్నారనుట నిశ్చయము.

ఈవ్యాసములో గాంధిగా రొక మాలపిల్లను దనయింటం బెట్టుకొని కూఁతునివలెఁ బెంచుకొనుచున్నారని విని వానికిఁ దగిన పనియే చేయుచుండిరని పైఁ జేర్కొనిన విద్వాంసుని, ఈవక్తను బ్రశంసించితిని. బొంబాయిలోనే గాక యీదేశమునందును అట్టి సభలు కొన్నిచేసి సంఘముల నేర్పరింతురు గాక యని కోరుచున్నాను.

" సంపాదకుఁడు "

ఇదియునుంగాక యీకవిరాజుగారి హితబోధంగూడఁ దిలకింపుఁడు:—

# హితబోధనము.

కాలము తల్లక్రిందు లయినది. స్వధర్మము లడుగంటినవి. వర్ణసంకరము వ్యాపించినది. బ్రాహ్మణ పంక్తికిం జేరినవారే సురాపాన మాంస భక్షణాది దురాచారముల ననుష్ఠించుచున్నారు. చండాల సంపర్కమును గలిగించుకొనుచున్న వారు. అన్యమతస్థులు, బ్రహ్మమతస్థులు, గాంధిమతస్థులు లోనగువారు పైకి రాకకుం జేయూఁత నిచ్చుచున్న వారు వారి బలంబునం బ్రబలి యథేచ్ఛముగం బ్రవర్తించుచున్న వారు. వారివర్తనమున కడ్డాకింతయు లేక యున్నది. పీఠాధిపతులు నామమాత్రావశిష్టులై యున్నవారు. చండాల సంపర్కము చేయవచ్చునను సభలకు, పరిశుద్ధవైదికవంశమునం బుట్టిన పండితంమన్యులై పోయి అగ్రస్థానము లలంకరించుచున్నవారు- వారు పైకి వచ్చి శ్రీరంగనీతులు చెప్పుచున్నవారు- సదివాసులు చూపిన వారు చండాలుల యిండ్లలో భుజించుటకే కాదు వారితో సంబంధబాంధవ్యములు గలిగించుకొనుటకైన సందేహింపరు. ధనమూల మిదం జగత్తనున్యాయ మిప్పుడు సార్థకమై యొప్పుచున్నది. 19-6-25 వ తేదీని పాలకుర్మిలో జరిగిన సభలో ఉపద్రష్ట సుబ్రహ్మణ్యశాస్త్రిగా రుపన్యసించుచు "లోకములోఁ గొందఱు తనపై నపవాదమును గల్పించినారనియు, చండాలాస్పృశ్యత విహితము కాదని పలివెలలోఁ జెప్పితి ననియు తమతప్పు లేదనియు" జెప్పినట్లు వ్రాసియున్నారు. తప్పు లేదనినప్పుడు "అస్పృశ్యతానివారణసభ కధ్యక్షుఁడుగా నివేలయుంటివి, వది తప్పు కాదా?" అని యెవరైననడిగియుండవలసియుండె. అట్లు జరిగినట్లు తోచదు. ఇట్టిభయసందేహములచేతనే వర్ణసంకరము ప్రబలుటకు హేతు వయినదనుట నిశ్చయము.

ఇట్టిచో నుత్తమబ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు నడుముగట్టి గట్టి ప్రయత్నములు చేసి తా మెట్టిభయసందేహములనుం బొందక దైవముపై భారము వైచి న్యాయమార్గమునం బ్రవర్తించుచు లోకము నావరించిన దురాచారపిశాచమును వెడలఁ గొట్టవలెను. ఇందు విషయమై కేవలసభలు మాత్రము చేయుచున్న నేమియు లాభము

లేదు. అప్పటి యుపన్యాసములు తీర్మానములు నప్పటికప్పుడనే చరితార్థము లగుచుండును. అట్లుగాక ప్రతిగ్రామమందును, ప్రతిపురమందును సంఘముల నేర్పఱుప వలెను. ఈసంఘము లన్నియు మండలసభను జెందియుండ వలెను. తగినవారిని ప్రచారకుల నియమింపవలెను. వారు ప్రతిస్థలమునకును బోయి వర్ణాశ్రమధర్మము లెఱింగించుచు మతబోధ చేసి సంఘము నభివృద్ధిలోనికిఁ దేవలెను. ప్రతిసభ్యుఁడు నెల 1 కి రు 0-2 0 లకు దక్కువ కాకుండ చందాల నిచ్చుచుండవలెను ఈ చందాధనము గ్రామసభాధిపతులు మండల సభకుఁ జేర్పవలెను. వారు దానిని దగునట్లు వినియోగింపవలెను. గ్రామములలో తప్పు చేసినవా రని తెలిసినంతనే తత్తత్సభాధిపతులు విచారించి తమయభిప్రాయము మండలసభకు నివేదింపవలెను. మండలసభవారు వారిని బహిష్కరించినట్లు తీర్మానించి గ్రామసభాధిపతుల మార్గమున గ్రామస్థులకుఁ దెలుపుచుండవలెను. అప్పు డప్పు డవసరమును బట్టి సభలు చేయుచు నాయా విషయ మంతయు నొకపత్రికను స్థాపించి తన్మార్గమునఁ బ్రకటింపవలెను. ఇందుఁ జేరిన యేసభ్యునికైన మతవిషయమున నభియోగాదులు తటస్థించినయెడల మండలసభ్యులు లోనగు వారందఱును దోడ్పడవలెను. ఇత్యాదు లనేకములు చేసి వర్ణాశ్రమ ధర్మములు నిలుపఁ బెట్టవలసిన సమయము వచ్చినది.

శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహం॥

అని భగవంతుఁడు చెప్పియున్నాఁడు. ఇప్పుడు ధర్మస్వరూపులైన మీరే భగవంతులయి బయలుదేరి ధర్మమును బ్రతిష్ఠించి కృతకృత్యు లగుదురుగాక యని విన్నవించుచున్నారము. ప॥ సం॥

చూడుఁడు- వర్ణాశ్రమధర్మసంస్థాపనము.

## Extract from the life of Swami Vivekananda (page 286) of Vol II.

On the morning of the opening of the Parliament we all assembled in a building called Art Palace where

one huge, and other smaller temporary halls were erected for the sittings of the Parliament. Men from all nations were there. From India were Mazoomdar of the Brahmo Samaj and Nagarkar of Bombay Mr. Gandhi representing the Jains and Mr. Chakravarti representing Theosophy with Mrs. Annie Beasant.

పై దానివలన శ్రీ గాంధీగారు జైనమతాభిమాని యనకతప్పదు. అట్టివాని జైనమతధర్మములు వైదికమతధర్మములనబడవు. వైదిక కర్మవిధానమం దాయనను ప్రమాణముగాగైకొని వర్తించవలయునని కోరెడి వైదికమతావలంబులకు వెర్రిబట్టినదనవలయు. మహాత్ముడు బోధించునవి జైనమతధర్మములే గాని వేరుగాదు.

వారిమధ్య ప్రకటించిన ఎంగ్ ఇండియా పత్రికలో రాజకీయాందోళనములో తాను ప్రవేశించుట మానుకొనినచో తాను చేయవలసినది తోటిపనియేగాని మరియొకటి లేదని జెప్పియున్నాడు.

తోటివాడనగ బయల్పడిన మానవ మలములచే మానవాది జీవప్రపంచమున కుపద్రవ మొనగూడకుండునటుల పవిత్రముచేయువాడని వారియభిప్రాయమయియున్నది. వారివంటివారు తోటిపనిని చేయబూనినపుడు మానవత్వమెల్లయు తోటిపనినే చేయవలయునని బోధించుటగాక మరేమియగు ? అట్లు తోటిపనినిచేయుమని బోధించననవీలులేదు. తనయొక్క పరమవిధేయత్వమే వెల్లడించెననవలయు. మానవత్వమందు మలమునకు తుల్యమైన నీచకార్యముగాని, దీనికి తుల్యమయిన ప్రాణసంరక్షణకార్యముగాని లేదని తెలిసియేయున్నది. మలవిసర్జనము లేకుండవీలగునా ? మలవిసర్జనము మానవత్వముండువరకు దప్పినదికాదనుటలో నివ్వాదమేగదా ? అట్టిసర్జనము కడమ వ్యాపారములతో సమానముగ జరుగవీలున్నదా ? భోజనముచేయుచోటనే మలవిసర్జనమొనరించవీలగునా ? మలవిసర్జనమునకు సమయములు దేశములు కడమకార్యములకన్న ప్రత్యేకమయియుండునుగదా ? తోటివాడు మలములగంపతోపాటు భోజనపదార్థములను తయారుచేయుచోట గమనించు పరిశుభ్రత మలవిసర్జనమం దుండనేరదుగదా ? మలము యొక్క పూర్వరూపము పరిశుద్ధమయిన యాహార

పదార్థమేమైనను శరీరసంబంధపాకదోషముచే మలమయి హేయమగుచున్నదిగదా? దానిని దూరముగ విసర్జనము చేయుచున్నాముగదా? తోటివాడొనరించవలసిన పనులను శ్రీగాంధిగారు లెస్సగా విచారించినగదా దానినిచేయ నిశ్చయించుకోవలయు? మలముల దూరస్థానమునకు గొనిపోయి పారవేయువలసిన తోటిపనియు, సర్వ రుచులతో నొప్పు ఆహారపదార్థముల పాకముచేయు వంటవానిపనియు వేరు సేరని తెలియవలయుగదా? ఆహార గ్రహణము మల విసర్జనము రెండును జీవత్వముండువరకు తప్పినది కాదు. మానవ వ్యాపారమందు మలము విషప్రాయమయియున్నది. ఆప్రకారమే గాడిదె, కుక్క, కాకి, కోడి, పిల్లి, పంది మొదలగు జంతుజాలముల మలము సహితము విషప్రాయమయియున్నది. ఆవు, బర్రె మొదలగుకొన్నిటి మలము విషప్రాయములు గానివైయున్నవి. దేహతత్వముల ననుసరించి మలముల మంచి చెడుగులు గమనింపబడుచున్నవి. ఆలాగుననే మానవులందరి దేహతత్వముల ననుసరించియే గ్రాహ్యముగాని హేయముగాని వేరుగాదు. దేహములన్నియు గుణత్రయ వికారములతో బుట్టుచున్నవి. గుణత్రియ వికారజన్యములే సర్వజీవ వ్యవహారముగాని వేరుగాదు. మల విసర్జన మెట్లు జీవసమూహ ముండువరకు తప్పదో మలస్వరూపమగు చండాలత్వము సహితము తప్పనది కాదనియు బ్రాహ్మణ్యము చండాలత్వము సమానము గాదనియు, చండాలత్వము సహితము ప్రాణాధారమునకు గొప్ప సహాయకారియే యనియు దానికి విధించబడియున్న పద్ధతులయందే యది వర్తించవలసి యున్నదనియు తెలియవలయు. శ్రీ గాంధిగారు తోటివాని ప్రస్తాపనము తెచ్చినందున దీనిని వివరించవలసివచ్చెను గాని చండాలుల నిందించుటకు కాదని చదువరులు గ్రహింతురుగాక. ఇందుచే దోషము నధ్యారోపము చేసుకొనకుందురని క్షమాపణము కోరువాడ. ఇందువిమర్శనమే నాయుద్దేశము గాని నిందయనునది సంకల్పపబడుట కాదని విన్నవించువాడ:—

మఱియు, నిలుచుండికాని మాటలాడుచుఁగాని యితరుని ముట్టుకొనికాని దిక్కులఁజూచుచుఁగాని యాచమనము చేయఁగూడదు. మఱియు, కాకిని కుక్కను గాడిదను నశుద్ధమును బందిని గోడిని ముట్టునాండ్రను జంజాలురను బతితులను జూచుచు నాచమనము చేయఁగూడదు. పూర్వముఖముగాఁగాని యుత్తరముఖముగాఁగాని యాంచమనము చేయుఁదగినది. శ్లో॥ కేశవాద్యైస్త్రిభిఃపీత్వైకేన దక్షకరం మృజేత్ ద్వాభ్యామోష్ఠౌచ సంమృజ్య ఏకేనోన్మార్జయేచ్ఛుతౌ॥ జలమేకేనసంమంత్ర్యైకేన వామకరం మృజేత్ ఏకేన దక్షిణం పాదం వామమేకేనచైవతు॥ సంప్రోక్ష్యైకేనమూర్ధాన మూర్ధ్వోష్ఠం నాసికాద్వయం నేత్రయుగ్మం శ్రోత్రయుగ్మం దక్షిణోపక్రమం క్రమాత్॥ నాభిం హృదయమూర్ధానౌ దక్షవామభుజౌ స్పృశేత్॥ (కేశవాదినామత్రయముతో జలము మూఁడుసారులు పుచ్చుకొని తరువాత నొకనామముతోఁ గుడిచెయ్యిని గడిగి రెండునామములచేఁ బెదవులరెంటిని దుడిచి యొకనామముతో నాపెదవులను మార్జనచేసి యొకనామముతో జలమును మంత్రించి యొకనామముతో నెడమచెయ్యిని దుడిచి యొకనామముతోఁ గుడిపాదమును నొకదానితో నెడమపాదమును నొకదానితో శిరస్సును నొకదానితోఁ బైపెదవిని రెండునామములతో నాసికాద్వయమును రెండునామములతో నేత్రయుగ్మమును రెండునామములతో శ్రోత్రయుగ్మమును నొకదానితో నాభిని నొకదానితో హృదయమును నొకదానితో శిరస్సును రెండునామములతో భుజములను స్పృశించవలెను.) ఏతావదాచమనాశక్త స్త్రిభిః పీత్వా కరం ప్రక్షాళ్య దక్షిణకర్ణం స్పృశేత్ (ఈలాటియాచమనమందు శక్తుఁడు గానియెడల మూఁడుసారులు జలపానముచేసి హస్తము కడిగి కుడిచెవిని ముట్టుకొనఁదగినది.

కర్మకుర్వన్నధోవాయునిస్సరణే అశ్రుపాతే క్రోధే మార్జారస్పర్శే క్షుతే వస్త్రధారణే రజకాద్యంత్యదర్శనే ఆచమేత్. స్నాత్వా పీత్వా భుక్త్వా సుప్త్వా చాచమేత్. విణ్మూత్రరేతశ్చ్యుచాంతే ఆచమేత్. సర్వత్రాచమనాసంభవే దక్షిణకర్ణస్పర్శః. (కర్మనుచేయుచుండఁగా నపానవాయువు వచ్చినయెడలఁ గన్నీళ్ళువచ్చినయెడలఁ గ్రోధముకలిగినప్పుడు పిల్లిని ముట్టుకొన్నయెడలఁ దుమ్మినయెడల వస్త్రము కట్టుకొన్నయెడలఁ జాకలివాఁడు మొదలగు కడజాతివారిని జూచినప్పుడు స్నానముచేసినప్పుడు భోజనముతరువాత నిద్రించిన తరువాత మలమూత్రాదివిసర్జనము న్దైనఁ గరపాదప్రక్షాళన తరువాతను నాచమనము చేయువలెను. కారణాంతరముచే నీకాలములందు శుద్ధజలాదులు సంభవించకపోయిన యెడలఁ గుడిచెవిని స్పృశించఁదగినది.)

శ్లో॥ యఃక్రియాఃకురుతే మోహాదనాచమ్యైవ నాస్తికః భవంతిహి వృథా తస్య క్రియాస్సర్వా నసంశయః॥ (పైనిజెప్పఁబడినవిధిప్రకారముగా నాచమనము చేయక యెవ రితరకర్మములను జేయుదురో వారు చేయు సత్కర్మము లన్నియు నిష్ఫలములగునుగాన నాచమనవిధి తెలిసికొని యాచరించవలెను.) ఈయాచమనము స్నానదానాదులయందు రెండేసిసారులు చేయఁదగినది. శ్లో॥ స్నాత్వా పీత్వా క్షుధే సుప్తే భుక్త్వా రథ్యోపసర్పణే। ఆచాంతః పునరాచామే ద్వాసో విపరిధాయ చ॥ (స్నానముచేసినను పానముచేసినను దుమ్మినను నిద్రపోయినను భోజనముచేసియు బాజారునకుఁబోయివచ్చినను వస్త్రధారణచేసియు రెండుసారు లాచమనము చేయుచుండవలెను.) ఇటులనే మలమూత్రోత్సర్జనాదులయందును ద్విరాచమనము చేయఁదగినది. అయితే నాచమన మిన్నికట్టుబాటులతోఁ జేయుచున్న నేమియనిన మంచిదిగాదు. సర్వజ్ఞమూర్తియగు భగవంతుఁడు ధర్మసూక్ష్మముల గమనించి యీయాకర్మ మిటుల నాచరించినఁగాని జనులు పరిశుద్ధులుగారను నభిప్రాయముతో నీలాటికట్టుబాటు లేర్పఱిచియున్నాఁడు.

ఈధర్మవాక్యముల సర్వజ్ఞమూర్తియగు భగవంతుఁడును మహాఋషులును గుర్తెఱుఁగుదురుగాని మనము తెలిసికొనుట దుర్లభము. సర్వజ్ఞమూర్తులగు నా ఋషులు చేయుమన్నరీతిని జేయుటయే మనకు విధిగాని యీకర్మమిటుల నేల చేయవలెను, మఱియొక విధముగాఁ జేయఁగూడదా యని యడుగుటకు మన కధికారము లేదు. వేదశాస్త్రములు ప్రభుతుల్యములు. సద్ధర్ముఁడగు ప్రభువు ప్రజల క్షేమముకోరి ధర్మజ్ఞులగు విద్వాంసుల ద్వారమునఁ గొన్ని ధర్మశాసనములను బ్రవర్తింపఁ జేయుచుండఁగా నా ధర్మశాసనము లేయభిప్రాయముతో నేర్పడినవో యాయభిప్రాయము కొందఱికిఁ దెలియకపోయినను నా చట్టములకు బద్ధులైయుండియే తీరవలెను. ఆచట్టమును ధిక్కరించుట పనికిరాదు. అలాటివారు శిక్షాపాత్రులగుదురు. అటులనే యీయాచమనాదులందుఁగల విధులకు మనకుఁ దృప్తికరముగాఁ దగిన యభిప్రాయము బోధపడకపోయినను సర్వజ్ఞుఁడగు నీశ్వరుని యాజ్ఞగనుక నా మన యావిధులయొక్క యనుభవముగలవాఁడై జనులయొక్క క్షేమముఁ గోఱి కేర్పఱచుటచేతను మన మావిధులను ధిక్కరింపక శాస్త్రమందుఁ జెప్పురీతిగా నాచరించవలెను. అటుగాక కొత్తకొత్తమార్పులుగాని మానుకొనుటగాని చేసినయెడల నీశ్వరాజ్ఞాధిక్కారము చేసినవారలమై పరమందు దానికనుగుణమగు శిక్షకుఁ బాత్రులమగుదుము. ఆత్మయుఁ బవిత్రము గానేరదు. సంసారదుఃఖములు మానవు. కాన నీశ్వరుఁ డేమి యామహానుభావుని యభిప్రాయము గుర్తెఱిఁగిన ఋషులేమి యేలాటి విధులేర్పఱిచిరో వానిని దప్పకుండ నాచరించఁ దగియున్నది. కాన నాచమన మీకాలమందుఁ జేయఁదగినది, చేయురీతు లీలాటివి యను మొదలుగాఁగల విధులెందుకు, నేదోయొకవిధముగా మనయిష్టానుసారము చేయఁగూడదా యని యాశంకించఁ గూడదు. ఇటులనే వెనుకఁజెప్పఁబడినకర్మములఁ గూర్చియు నిఁకఁ జెప్పఁబోవుకర్మములఁ గూర్చియు నూహించఁదగినది,

అనంతరము దంతధావనము.

శ్లో॥ ప్రక్షాళ్య చరణౌ హస్తౌ ముఖంచాథ యథావిధి ఆచమ్య ప్రాఙ్ముఖస్సిత్వా దంతధావన మాచరేత్ ॥ త్యక్త్వాభిమంత్రణం తూష్ణీం వృథాస్యాద్దంతధావనం అస్య ప్రజాపతిఋషిః శ్ఛందోనుష్టుప్ వనస్పతిః॥ దేవతేతిహృదిస్మృత్వా మంత్రారంభే భవేద్బుధః ॥ (ఆచమనము చేసిన తరువాతఁ దూర్పుగామంలి మంత్రాభిమంత్రణపూర్వకముగా దంతధావనము చేయవలెను. వనస్పతి మంత్రమునకుఁ బ్రజాపతిఋషి. అనుష్టుప్ ఛందస్సు వనస్పతిదేవత. ఇట్లు మనస్సులో ఋషి దేవతల స్మరించి మంత్రాభిమంత్రణపూర్వకముగా దంతధావనము చేయఁదగినది. అభిమంత్రణ లేకుండ దంతధావనచేయుట వ్యర్థము. ఆమంత్రము శాస్త్రమందుఁ జెప్పఁబడినది. శ్లో॥ ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశు వసూనిచ। బ్రహ్మజ్ఞానంచ మేధాంచ త్వం నోదేహి వనస్పతే ॥ ఈమంత్రముచే దంతకాష్ఠము నభిమంత్రించవలెను. దంతకాష్ఠాభిమానదేవతను ప్రార్థించుట యీమంత్రమందుఁ జెప్పఁబడినది. ఓవనస్పతీ ! మాకాయుర్దాయము బలము యశస్సు కాంతి సంతానము పశువులు ధనము బ్రహ్మజ్ఞానబుద్ధివిశేషములు నిమ్మని ప్రార్థించుట. ఈమంత్రముచే నభిమంత్రించి దంతధావనచేయవలెను. దంతకాష్ఠ యోగ్యవృక్షములును దాని ప్రమాణమును జెప్పఁబడినది. శ్లో॥ కంటకక్షీరవృక్షాణాం ద్వాదశాంగుళసంమితం । కనిష్ఠికాగ్రవత్థూలం పూర్వార్ధకృతకూర్చకం దంతధావన ముద్దిష్టం జిహ్వోల్లేఖినికాతథేతి ॥ ముండ్ల చెట్లయొక్క-పాలుగలచెట్లయొక్కయుఁ గాష్ఠము పదిరెండంగుళములపొడవుగలదియుఁ జిటికెనవ్రేలెడులావుగలదియు దంతధావనమునకు శ్రేష్ఠమైనది. కాష్ఠఫలములుగూడఁ జెప్పఁబడినవి.

శ్లో॥ సర్జేధైర్యం వటేదీప్తిః కరజే విజయోరణే । ప్లక్షేచైవార్థసంపత్తిర్బదర్యాం మధురస్వనః॥ ఖాదిరేచైవ సౌగంధ్యం బిల్వేతు విపులంధనం

ఔదుంబరేణవాక్సిద్ధి ర్బంధూకేచ దృఢాశ్రుతిః॥ వ్రజేచ కీర్తిసౌభా
గ్యం పాలాశేసిద్ధిరుత్తమా। కదంబేచ సదాలక్ష్మీ రామ్రేచారోగ్య
మేవచ॥ అపామార్గే ధృతిర్మేధా ప్రజ్ఞాశక్తిర్వపుశ్శుచిః। ఆయుశ్శీలం
యశోలక్ష్మీ సౌభాగ్యంచోపజాయతే॥ అర్కేణదంతరోగస్తు బీజపూ
రేణతున్యథాం। కకుభే తథాయుష్యం తథాఫలితవర్జితః॥ దాడిమేసిం
దువారేచ ఖుల్లకేకటకే తథా। జాత్యాచకరమర్దేచ దుస్స్వప్నంచైవనాశ
యేత్॥ మద్దిపుల్లతో దంతధావనచే ధైర్యముగలుగును. మఱ్ఱియూ
డచే శరీరకాంతిగలుగును. జువ్విపుల్లచే ధనసంపత్తుగలుగును. రేఁగు
పుల్లచే మధురస్వరముగలుగును. జంద్రపుల్లచే సుగంధముగలుగును.
మారేడుపుల్లవల్ల నెక్కుడధనముగలుగును. మేడిపుల్లచే వాక్సిద్ధి.
బంధూకకాష్ఠముచే బాగుగావినఁబడుట మోదుగుపుల్లవల్ల నుత్తమమైన
సిద్ధియుఁ గదంబకాష్ఠమువల్ల లక్ష్మియు లభించును. మామిడిపుల్లవల్ల
నారోగ్యమును నుత్తరేణుపుల్లవల్ల మేధ ప్రజ్ఞ పరిశుద్ధత యాయుర్వృద్ధి
యశస్సు లక్ష్మి సౌభాగ్యము మొదలగు ఫలములు గలుగును. జిల్లేడు
పుల్లచే దంతరోగములుపోవును. మాదిఫలపుఁజెట్టుపుల్లచే మనోవ్యథా
నివృత్తియు నేఱుమద్దిపుల్లచే నాయుర్వృద్ధియు దానిమ్మపుల్లవలన
దుస్స్వప్ననాశనమును గలుగును. గాన నీచెప్పఁబడిన కాష్ఠములతో
దంతధావనచేయుఁదగినది. కొన్నికాష్ఠములను మనము దంతధావన
కుపయోగించఁగూడదు. అవి యేవనిన, శ్లో॥ శాల్మల్యశ్వత్థభవ్యా
నాం తిందుకింశుకయోరపి। కోవిదారశమీపీలుశ్లేష్మాతకవిభీతకాః॥
వర్జయేద్దంతకాష్ఠేషు గడులుం క్రముకం తథా॥ బూరుగుపుల్లయు
రావిపుల్లయు గోగుపుల్లయు మొదలగువానితో దంతధావనము
చేయఁగూడదు.

శ్లో॥ ప్రాచ్యుదఙ్ముఖఆసీనః ప్రాగుదఙ్ముఖఏవవా। దంతానాం ధావనం
కుర్యాద్వాగ్యత స్సోమదిఙ్ముఖః॥ పూర్వాముఖే ధృతింవింద్యాత్ శరీ

రారోగ్యమేవచ దక్షిణేనతథా క్రౌర్యం పశ్చిమేన పరాజయం॥ ఉత్తరేణ గవాంనాశం స్త్రీణాంపరిజనస్యచ పూర్వోత్తరేతు దిగ్భాగే సర్వాన్కామానవాప్నుయాత్ ॥ తూర్పుదిక్కు ముఖముగలవాఁడై దంతధావన చేసినయెడల శరీరారోగ్యము ధైర్యము గలుగును. దక్షిణముగాఁ జేసినయెడలఁ గ్రూరత్వమధికమగును. పశ్చిమముఖముగాఁ జేసిన పరాజయము గలుగును. ఉత్తరాభిముఖుఁడై చేసిన గోనాశము గలుగును. స్త్రీలకును బరిజనమునకును నష్టము. ఈశాన్యదిఙ్ముఖుఁడైనయెడల సమస్తములైన కోరికలను బొందును. శ్లో॥ ప్రతిపత్పర్వషష్ఠీషు చతుర్దశ్యష్టమీషుచ నవమ్యాం భానువారేచ దంతకాష్ఠం వివర్జయేత్॥ పాడ్యమి పూర్ణిమ యమావాస్య షష్ఠి యష్టమి నవమి యాదివారములయందుఁ బుల్లతో దంతధావన చేయఁగూడదు. శ్లో॥ ఉపవాసదినే యోవై దంతధావనకృన్నరః । సఘోరనరకంయాతివ్యాఘ్రభక్షం చతుర్యుగం ॥ శ్రాద్ధోపవాసేదివసే ఖాదిత్వా దంతధావనం గాయత్ర్యాశ్శతసంపూత మంబు ప్రాశ్యవిశుధ్యతి ॥ అలాభే దంతకాష్ఠానాం ప్రతిషిద్ధదినే ష్వపి । తస్యత్వపాంతుగండూషై ర్ముఖశుద్ధి ర్భవిష్యతి॥ అంగుళ్యాధావయేద్దంతాన్ వర్జయేత్ప్రదేశినీం మధ్యమానామికాంగుష్ఠై ర్దంతధావో భవిష్యతి ॥ శ్రాద్ధదివసమందు నుపవాసదివసమందును గాష్ఠముతో దంతధావన చేయఁగూడదు. అటుచేసినయెడల నరకప్రాప్తిగలదుగానఁ దద్దోషనివర్తికిఁగాను నూఱుసారులు గాయత్రిచే నుదకమును మంత్రించి పుచ్చుకొనఁదగినది. నిషిద్ధదినములందును గాష్ఠము లభించనప్పుడును జుట్టనవ్రేలువదలి బొటనవ్రేలుతోఁగాని నడిమివ్రేలుతోఁగాని యుంగరపువ్రేలితోఁగాని యాకుతోఁగాని దంతధావన చేయఁదగినది. పదిరెండుసారులు జలముతో గండూషము చేసినను దోషములేదు.

శ్లో॥ ముఖశుద్ధిం ప్రయత్నేన కృత్వైవాహో ద్విజాతయః । ప్రాతస్సంధ్యాముపాసీత తాంవినా నశుచిర్భవేత్ ॥ దంతధావన యొకదినమందైనను మానఁగూడదు. దంతధావన చేసికొని కాని సంధ్యావందనమున కర్హుఁడుగాఁడు. దంతధావన లేనివాఁడు పరిశుద్ధుఁడు కానేరఁడు. కానఁ బ్రతిమానవుఁడు పైనఁజెప్పఁబడిన విధప్రకారము దంతధావన చేయఁదగినది. పైనఁజెప్పఁబడినవిధి నుల్లంఘించి చేసిన దంతధావనము పరమార్థోపయోగి కానేరదు. పరమార్థోపయోగి గాని పనిచేయుట నిరర్థకమనుటకు సందియము లేదు. మనమతము దీశ్వరాజ్ఞానుసారులును సర్వజ్ఞమూర్తులును నగు ఋషులు మనము తరించుటకుఁగాను బ్రతికర్మమును బరమార్థము కుపయోగించులాగున నేర్పఱచియున్నారు. వారి యేర్పాటుప్రకారము కర్మముచేసినయెడల మన మిహపరసౌఖ్యములను దప్పక పొందుదుము. అటులఁగాక మన యిచ్ఛానుసారముగా నిదంతధావనాదికర్మముల నాచరించినయెడల నైహికపర్యాయ మొకరీతిగా నైనను బరలోకోపయోగమగు ధర్మము లభించదు. మనము పరలోకోపయోగమగు ధర్మమును సంపాదించుకొనుట ప్రధానమని యెంచవలెను. మన పూర్వీకులందఱుఁ బరలోక ధర్మముకొఱకుఁ బాటుపడినవారు. ఆధర్మమువలనఁ బరలోకమం దనంతమైనసుఖ మనేకయుగముల కాల మనుభవించుదురని శాస్త్రములు చెప్పుచున్నవి కాన మనము పరలోకోపయోగము లేని కర్మము చేసిన నుపయోగము లేదు. ఋషులు చెప్పినరీతిగాఁ గర్మానుష్ఠాన మప్రమత్తులమై చేసినయెడల మన కిహలోకమందును బరలోకమందును లోపము లేకుండును. మన మతమం దితర మతములకన్న నిది యొక పెద్ద యతిశయము. ఈలోకము కుపయోగించు ప్రతికర్మమును బరలోకముకుఁగూడఁ జిత్తశుద్ధిద్వారమున నుపయోగించులాగునఁ దమ దివ్యదృష్టిచే నీశ్వరానుగ్రహమువల్ల గ్రంథరూపముగా ఋషులు మనకు బోధించుచున్నారు.

మన మతధర్మప్రకారము మనముచేయు ప్రతిపనియుఁ బాపోత్పత్తిలేకుండఁ బుణ్యసంపాదకముగా నుండును. ఇతరమతములం దీసదుపాయములు లేవుకాన వారుచేయు నన్నిపనులవలనను వారు ధర్మమును సంపాదించుకొనలేరు. మనము వారిమాదిరిగా ధర్మసంపాదకము గానిపనులు చేయఁదగదు. ఏకక్రియా ద్వ్యర్థకరీ బభూవ యను రీతిగా మనఋషులు మన కిహపరములకు రెంటికి నుపయోగించునటుల నేర్పాటు చేసియున్నారు. కాన మనము వారు నిరూపించినరీతిగాఁ గర్మానుష్ఠానము చేయఁదగినది. మఱియు, అటులఁ జేయమేని పరలోకోపయోగిధర్మము లేకపోఁగాఁ బైన నిరూపించిన రీతిగాఁ గొంత పరలోకహానికరమగు నధర్మముగూడఁ బుట్టునని నమ్మవలసియున్నదికాన ధర్మసంపాదకము గానట్టియు నధర్మసంపాదకమయినట్టియుఁ బని ప్రాజ్ఞులగువారు చేయరు. మనము ఋషులుచెప్పిన రీతిని దప్పక యీ దంతధావనాది కర్మానుష్ఠానపరులమై యిహపర శ్రేయస్సులకుఁ బాత్రులము కాఁదగినది.

## స్నానము.

పైనఁజెప్పఁబడినరీతిగా దంతధావన మాచరించి యాచమనము చేసి స్నానము చేయఁదగినది. కూర్మపురాణము. శ్లో॥ ప్రభక్ష్యదంతకాష్ఠంవై క్షాళయిత్వా విధానతః । ఆచమ్య ప్రయతో నిత్యం ప్రాతస్స్నానం సమాచరేత్ ॥ ఈవాక్యము దంతధావనమైనతరువాత నాచమనముచేసి ప్రాతస్స్నానము చేయవలయునని విధించుచున్నది. ప్రాతస్స్నానముచేసినయెడల మనకుఁ బ్రతిదినము రహస్యాది కృతమగు సర్వపాపమును నశించును.

ఆ॥ నిత్యవస్త్రమైన నిర్దయత్వమునను జాడ్యకృత్యమునను స్వాస్థ్యఁ బొల్చి
నిందపాలు సేయుచునుందు రీసుందరుల్, యందకలదె వీరిగుణములకును,
తే॥ పూర్వికల్గడియించిన భూరికీర్తి ధవళితములకు నిజకులత్రయాగ్రహముల
నల్లఁజేయు నకృత్యంపుఁజెలువలన దీపపుంగొడవిధమునఁ దిరుగఁబోఁడి,
సీ॥ పురుషహృత్పద్మముల్ పొంపారి ముకుళింపఁగం జేయఁ జంద్రమఃకాంతిగాఁగ
ధర్మమున్ వెన్నుమాను ధరణిపైఁ బెన్నుఁగ గూలఁద్రోయుట కొదుగాలిగాఁగఁ
గామ్యప్రపంచములోఁ గాలు వెట్టుటయును వెస లోపలికినీడ్వ మొసలిగాఁగఁ
మోక్షంబు సేరెటి ముఖ్యమౌ నగరంపు మార్గంబునకు గడ్రనూను గాఁగ
సంతతైచయంబునకుఁ జెఱసాలగాఁగ ఘన త్రివిష్టపస్థితి కొక్కఁ గర్తగాఁగ
ఘోరసంసారవిపినవాగురయుఁగాఁగ బ్రహ్మచేత సృజింపఁగఁబడియెఁ బడఁతి
కం॥ మగవారిని బంధింపఁగఁ దగుసాధన మింతయొండి దక్కంటి దేత
దృగ్గవానున కగుపడమిని వగలాడి సృజించె సువృషపాశము గాఁగన్" ౨౩౦
వ॥ అను పద్యంబులు చదువుచు బహుప్రకారంబుల విలపించి స్త్రీంగూర్చి
చింతించి ౨౩౧
సీ॥ "సంసారసంబంధి సౌఖ్యంబులేనియు ననుభవింపఁగనైతిఁ దనివిదీఱఁ,
గడు లోభినగుచు నొక్కఁడనేని యంత దానముఁజేసికొననైతి విపులమతిని,
నొక్కఁడిన బేరి జక్కఁగాఁ గూర్చుండి జపియింపఁగానైతి శైవమునను,
జ్వలితాగ్ని నాజ్యాహుతుల భక్తి సేనాఁడు వ్రేల్వఁబూనఁగనైతి విధియుతముగఁ,
గావలసినంత విభవంబు గలిగియుండియును బొనర్పఁగనైతి నే నొక్క సుకృతి,
గడియ తీరికలేకుండఁ గాలమెల్ల వ్యర్థపుచ్చితి నకట! ధనార్జనమున, ౨౩౨
తే॥ లోభికిం గుల్యుఁడగు దాత లోకమునను బుట్టియుండఁ, డిఁకెన్నఁడుం బుట్టఁబోఁడు
తాను దన ధనమును జేతఁ దాఁకనైనఁ దాఁక కితరులకర్పించు ధన్యుఁడతఁడు, ౨౩౩
కం॥ దానము భోగము నాశము మానుగ ని మూఁడుగతులు మహిఁ ధనమునకున్,
దాని నిడఁడో భుజింపఁడో దానికి మూఁడవదియైన ధ్వంసమె గతియౌ, ౨౩౪
ఆ॥ ద్రవ్యరహితుఁడయ్యు దాతగాకుండ చో శ్రుతి దరిద్రుఁ డనుచుఁ జెప్పఁబడును,
దానమార్గమునకుఁ దత్సముద్రము నిర్జలప్రదేశముగఁ దలంపఁబడదె, ౨౩౫
కం॥ ఎపుడును వచ్చుచుఁ బోవుచు నుపయుక్తంబయి ధనంబు యోగ్యులయొద్దన్
విపులవ్యర్థాన్వితంబగుఁ, గృపణునికడ నిమ్మపోవుఁ గిమ్మనకుండన్, ౨౩౬
కం॥ దీనుల కీవలెఁ దినవలెఁ గానీ సంచయము తగదు కలిమి ఘటిల్లన్,
ద్రామల నీగలుకూర్చిన తేనియ పెరజనులుత్రావి తృప్తులు కారే, ౨౩౭

తే॥ ఏది యాచింపఁబడి యర్థి కీయఁబడదొ యేది యజ్ఞంబులోన వ్యయింపఁబడదొ
యా కదర్యునిఁ జిత్తంబైన ధనము చోరపార్థివగృహములఁ జేరుచుండు,
ఆ॥ దానమే గుణంబు ధనవంతులకుఁ జూడ, దానికన్న గుణంబు ధనసమృద్ధి,
రెండుగూడ నొకట నుండక యున్నచో నగును మోస, మిది యథార్థ వరయ,
ఆ॥ పసపుఁజెలువు ఘనుఁ బథికులకుం గూడ భోగ్య గాక భార్య పోల్కి నెపుడు
నొంటి నింటిలోనె యుండెడి లక్ష్మిచే నేమి చేయఁబడెడి నెంచి చూడ, ౨౪౦
కం॥ జనులకుఁ బ్రాణాధారము ధనమే యగుఁ గాని ధనమ్యుతశ్రీగా దరయఁగఁ,
ధనికుఁడైన లోభి యతిశయమున నే ధరియింపఁబడెడి భూమి నిజముగఁ ౨౪౧
తే॥ పసిడి కొట్టులకృపచేతఁ బృథివిఁ దాఁచు వాఁ డుచున్నాఁడు గూఢపాన్నయకుండు
తత్ఫణీంద్రుఁ యాత్మచేతను ధనంబు భూగతంబొనరింతురు పూర్వులు" ౨౪౨
వ॥ అని తన్నుఁ దాఁ దిట్టుకొని బహుఖంగులం బ్రలపించు మణిభద్రుం బట్టుకొనిపోయి రాజభటులు నిష్ఠురంబుగం గట్టునుఁ జెట్టునకు వ్రేలఁగట్టుటయు ౨౪౩

— పుష్పుఁడు మణిభద్రుని గృహక్షేత్రాదులు స్వాధీనము చేసికొనుట —

తే॥ పుష్పుఁడు నుకళంకతూర్యము ల్మ్రోయుచుండఁగ మాగకాభిముఖ్యమైన పుమ్మగునఁగూడి
బంధువులు వెంటరా మోదమందుచు నుగరనగుమ నవీనుఁడు పద్మముల ను,
వ॥ ఆంత్య నన్నుగ్రహంబున నొక్కరుండును నతని నాస్తశేషితంబులు ఆంటి యుండ నట్లు పితృపైతామహంబగు మందిరంబునం బోలె నంగి తన్మన్యంబునం గూర్చుండి బంధుల నందఱం బిలిచి ౨౪౪

ఉత్సాహము॥ ప్రాసుచిరమునుండి రొమ్ముగి తా నువీనులక్ష్మి నేఁ
డీసునధ్య మాటవలన నెట్లొ నిల్చెఁ బ్రామ్మటన్,
ధీమముఖ్యుఁ డంకుచు నేను లోభ్యమూలకున్
బాసిపోవు డెలక్ష్మి, బాగుగా నెటింగితన్, ౨౪౫
కం॥ కావున మద్బాంధవులకు దేవబ్రాహ్మణులకును మదీయైశ్వర్యం
బే విభజించి యొసంగెదఁ, బోవిడిచెదఁ దీనినీనము పూర్తిగనిఁకన్,

వ॥ అని యొకరికొకరికి వారికి వస్త్రభూషణంబు లొసంగి వేదవిదులగు విప్రులం జేరు పేరునఁ బిలువఁబంచి యొక్కొక్కరి కొక్కొక్క సేఁగజోడు సదక్షిణంబుగా సమర్పించి యాటపాటలవారికిని విశేషించి యంధపంగ్వాదులకు నన్నంబు పెట్టించియు నంకుశంబు లిప్పించియు నందఱం బుచ్చివైచి తరుణియుం దానును ఘటిం

ఆ॥ ఇంతవఱకు నే నోకించుకయైనను బంచబాణసుఖముఁ బడసినయదిఁగ,
ముసలివొద్ద నేమి ముచ్చటఁ దీఱు, నీ కర్గమైతి స్వేచ్ఛ ననుభవింపు॥ ౬౫౯

వ॥ అని వాకుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౬౬౦

ఆ॥ "యౌవ్వనవయసుల నోగిఁ బ్రవేశింతునా? యైక్యమందుదున త్వదంగమందుఁ
బెద్దకాలమునకుఁ బ్రేయసీ! లభియించి, తేమి సేయుఁదోఁప, దేమనందు" ౬౬౧

వ॥ అని పలికి మన్మథవశుండై మైథునంబున కుపక్రమించి యెంతప్రొద్దు చని నదియు నెప్పుడు తెల్లవాఱెనదియు నెఱుంగ నేరక యింతియును దానును నేకాకృతిని భజించి యుత్కృష్టానుకలాకిక్షోభక్షులై యున్నంత దదయించుటయు నల్లయుండఁ నెల్లన కోటంబెట్టుకొని మరల మణిభద్రుమూపంబు ధరియించి యట్లు పగలెల్ల మణిభద్రుండును రాత్రిఁ బుష్పుండును నై పెద్దకాలముండి కొడుకులను బిడ్డలను గొడుకుల కొడుకులను గాంచి వృద్ధుండై ౬౬౨

ఆ॥ "మాయఁబన్ని నేను మణిభద్రుఁ జంపించి మగఁడనైతి వాని మానవతికి,
సంతుగూడఁ గంటి, నెంతయఘమ్ముఁగని, హాటకేశ్వరమున గనుగువాఁడ, ౬౬౩

—♦ పుష్పాదిత్యమాహాత్మ్యము ♦—

వ॥ అని చింతించి కొడుకులకు వేఱువేఱ భాగంబులు పంచియిచ్చి లెక్కలేని రొక్కంబును గొంచుఁ జమత్కారపురంబున కరిగి యాదిత్యుని కాలయంబు గట్టించి సర్వాంగశోధనంబుఁ జేయుండనుకొని చాతుర్వర్ణబ్రాహ్మణులకు సతీసహితంబుగా సాష్టాంగపడి ప్రాయశ్చిత్తముచేయించుటకును దద్దేవునకుఁ బుష్పాదిత్యసంజ్ఞం బొనరించుటకును బ్రార్థింప వారలు

ఆ॥ "త్వద్విశుద్ధికొఱకుఁ దగిన ప్రాయశ్చిత్త మాచరించువార మంతెకాని
యాజ్ఞవల్క్యకీర్తి హరియించుటకుమాత్ర మేము నిశ్చయముగ నిష్టపడము"

వ॥ అని చెప్పుటయు నందు మధ్యస్థవృత్తులగు మతికొందఱు ౬౬౪

కం॥ "ప్రాయశ్చిత్తనిమిత్తము దేయం బొకలక్షధనము ద్విజతతి, కటులే
యీయాదిత్యుని వృత్తికినై యిమ్మొకలక్షతీర్థ మభిలషితంబుల్" ౬౬౫

వ॥ అని యందఱుం గలసి లక్షద్వయపరిమితధనంబు పుష్పునివలనం గైకొని తదారాధితుండగు దేవుఁ బుష్పాదిత్యసంజ్ఞం బిలువందొడంగిరి, యాజ్ఞవల్క్యప్రతిష్ఠితుండైనను నాదేవునకుఁ బుష్పాదిత్యసంజ్ఞ యీవిధంబుగా నేర్పడినది, ౬౬౬

౯ రామూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౦ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౧ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం

౧౨ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౩ కాడమాను హనుమయ్యగారు, నర్సారావుపేట

౧౪ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

౧౫ భాస్కరరాయని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౬ నరసింహస్వామివారు, యాదగిరి

౧౭ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి

౧౮ పాలపర్తి గోపాలకృష్ణయ్యగారు, బెజవాడ

౧౯ జాలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు

౨౦ తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

౨౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨౨ నార్నెపాటి వెంకటసుబ్బారావుగారు, నర్సాపురం

౨౩ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, ఆక్టింగు కరణం, పాపయపాలెము

౨౪ చిక్కరాజు పట్టుపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి

౨౫ కవులూరి నరసింహారావుగారు, ఈలపోర్లు

౨౬ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు

౨౭ నడింపల్లి నరశింహారావుగారు, రిజిష్ట్రారాఫీసు క్లార్కు, క్రోసూరు

౨౮ రావకొండ వెంకటరామయ్యగారు, రొనమదల

౨౯ నారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు - తమ్మవరం

౩౦ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - పిడుగురాళ్ళ

౩౧ మండ చినవెంకయ్యగారు, దండమూడి.

౩౨ శ్యామాపంతులగోపాలరావుగారు-బందోబస్తు మొహతెమీన్-వరంగల్లు

౩౩ తిరుమలనల్యాన్ చక్రవర్తి వరదాచార్యులఅయ్యవార్లంగారు-శాతాపురం

౩౪ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౩౫ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం

౩౬ ఆలవెలిమె లింగన్న ముక్కద్దంగారు-గడిపెద్దాపురం

౩౭ కిషన్ రావు దేశపాండ్యాగారు- తాళ్లపల్లి

౩౮ వెంకటరాజయ్య మక్తేదారు, సీతారాంపురం.

౩౯ తోర్లకొండ లక్ష్మారెడ్డిగారు, క్షీరసాగరం.

౪౦ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం

౪౧ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖుగారు, పాపురం

౪౨ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

# అభినవ సరస్వతి.

పత్రికాధిపతి:— జానపాటి పట్టాభి రామ శాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమ ధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరిణీకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము . | ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 | సంకదోషము | ... | 0 | 3 | 0 |
| 11 | పులిందావివాహము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 12 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 8 | 0 |
| 15 | పశ్యాంపుశ్యాం | ... | 0 | 2 | 0 |
| 16 | పశ్వశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 22 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 23 | నూతసంహితే-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము.) | | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము,

జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరుజిల్లా.